# జోగాజానీ

( కోనన్ డైల్ )

(ఇంగ్లీషునకనువాదము.)



ప్రకాశకులు

శ్రీకృష్ణాబుక్ డిపో

రాజమండ్రి.

శ్రీ రాజన్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

రాజమహేంద్రవరము.

# పీఠిక.

ఇది ఆంగ్లేయమున నొక సుప్రసిద్ధ నవలాకారుడు వ్రాసిన దాని కించుమించు యనువాదమని చెప్పవచ్చును. ఇందు పరిశోధకుని విజ్ఞాన విశేషముల గానందించి నేనది చదివి నప్పు డనగా 1913 సంవత్సరమున తయారుచేసి యిప్పటికి వెలుతురునకు తీసికొని రాగలిగితిని. చదువరుల యాదరణ భాగ్య మందకపోదు. దీని తరువాత "పశ్చాత్తాపము, బంగారయోగము" వెలువడుచున్నవి. పాఠకులు తగినంత యాదరము చూపి కావలసినంత వరకు ప్రోత్సహించ ప్రార్థితులు.

ఇట్లు

నారాయణరావు జీ.

# జో రా జా నీ.



"ఏ మంత్ర దీక్షగా నాలోచించు చున్నావు? నీ చేతిలో ని యా ఉత్తరమేమి?"

"అదేమని నెమ్మదిగా నడుగుచున్నావా? బుద్ధిమంతుడవు! ఇది యీ ప్రొద్దుటి టపాలో వచ్చినది. ఈయూరి ముద్ర యేయున్నది. కాని యెక్కడనుంచియో యెవరిదగ్గరనుంచియో తెలియదు. ఉత్తర మిదిగో చూడు."

ఆ ఉత్తరము మంచి అందమైన దళసరి లేత ఊదా రంగు కాగితముమీద జాగ్రత్తగా వ్రాయబడి యున్నది. అందీవిధముగా నున్నది.

ఈ రాత్రి 8 గంటలకు—సరిగా యెనిమిది గంటలకు, మిమ్ము కలసికొనుటకై ఒకరు వచ్చెదరు చాల అవసరమైన వ్యవహారము. మీ పేరు ప్రఖ్యాతులు విని యున్నారు. మీరు నమ్మకస్థులనియు, గౌరవవంతులనియు చాల ప్రతీతి కలదు. అందుచేత మీ రా సమయమునకు ఇంటిదగ్గర నుండవలయును. మీ కొరకు వచ్చువారు గురుతింపబడ కుండుటకై ముఖమునకు ముసుగు వేసికొందురు. మీ రందుల కన్యథా తలంప వలదు.

"ఇదంతయు చాల తమాషాగా నున్నది. మకామూ లేదు. తేదీ లేదు. సంతకమంతకన్ననూ లేదు. దీని యభిప్రాయమేమై యుండును?" అన్నాడు చక్రపాణి రావు.

సుబ్బరామ నక్కడ ప్రసిద్ధిచెందిన వత్తేదారు. అతడు నెమ్మదిగా "అదే ఆలోచించుచున్నాను. జమాఖర్చు చూడ కుండ లెక్క స్థిరపరచుట చాల పొరపాటు. జరిగిన సంగతుల ను బట్టి కథ యల్లవలయును. కాని కథకు సరిపోవునట్లు సంగ తులు మార్చ ప్రియత్నించుట చాల బుద్ధిమాంద్యత. కాని యీ చీటి—దీనిని గురించి నీ యభిప్రాయమేమి?" అని అడిగి నాఁడు సుబ్బరామన్.

చక్రపాణి రావా చీటి చాల జాగ్రత్తగా పరిశీలన చేయుచు "ఉత్తరము పంపిన మహానుభావుడు మాత్రము చాల మంచి స్థితిలోని వాడై యుండును. ఇట్టి కాగితములు సామాన్యుల దగ్గరనుండవు. మంచి ఖరీదు కలవి" అన్నాడు.

"అవును. మంచి ఖరీదైనవే. సామాన్య మానవుడు కా డు. అదికాక యందులోని వ్రాతధోరణి చూచితివా? ధైమజ మును, అహంభావమును. చాల గొప్పవాడై యుండును. రహస్యగోపనమునకై ముసుగు వేసికొనునట. అదిగో! నేను పొరబడకపోయినచో-ఆవచ్చిన దతడే యై యుండును" అన్నా డు సుబ్బరామన్.

అతడా లాగున ననుచుండు నంతలో వీధిగుమ్మము దగ్గర చప్పుడులేని మోటారొకటి నెమ్మదిగా నాగినది.

"మంచి యింగ్లీషు కారు. నిశ్శబ్దముగా నాగినది. చాల ఖరీదైనది. ఈ వ్యాపారములో యేమి లేకపోయినను మంచి డబ్బుమాత్ర ముండు ననుకొనియెదను"అన్నాడు సుబ్బరామన్.

"అయితే నే నిచ్చటనుండి వెలుపలకు పోవుట మంచి దనుకొనియెదను. అన్నాడు చక్రపాణిరావు.

"ఆహా ఎంతమాత్రము వలదు. నీవెక్కడనున్నావో యక్కడనే ఉండు. నీవులేకపోయిన నాకు తోచదు. అదికాక యిది మంచి తమాషా వ్యాపారము లాగున్నది. దాటిపో నీయ వలసినది కాదు."

"కానీ—నీ—పెద్దమనుష్యుడు——"

"ఆ! వాని మాటకేమి. నీ సహాయము నాకు కావలసి యున్నది. అందుచేత వానికి కూడ కావలసియున్నదన్న మాటయే. అదిగో! అతడు వచ్చుచున్నాడు. నీవా పడకకుర్చీ లో కులాసాగా పండుకొని చెవులిటు త్రిప్పి జాగ్రత్తగా వినుచుండుము" అన్నాడు పత్తేదారు.

అంతలో మేడ చీడీలమీద, తాజుగానున్న బరువైన పదధ్వని వినవచ్చినది. గుమ్మము వెలుపల నాగిపోయినది.

వెంటనే అధికారమును సూచించుచు గంభీరముగా తలుపు కొట్టిన చప్పుడొకటి వినుపించినది.

"లోపలకు రావచ్చును" అన్నాడు సుబ్బరామన్.

వెంటనే తలుపు తెరచుకొని యావ్యక్తి లోపల ప్రవే శించినది.

వాని యెత్తు ఆరడుగుల చిల్లరకు తక్కువ యుండదు. మంచి బలిష్ఠమైన భుజద్వయము, విశాలమైన వక్షస్థలము. వాని, యమూల్యములైన దుస్తులును, వజ్రములు చెక్కిన చేతి

వ్రేళ్ల ఉంగరములును, బంగారు గొలుసునకు తగిలించిన బొత్తా ములును, విలువగల రాళ్ళుపర్చియున్న మణికట్టు గొలుసును, మంచి జరీ పని చేసిన ముచ్చెలును, వాని యయిశ్వర్యమును చెప్పకనే చెప్పుచున్నవి. అవన్నియు ప్రస్తుత నవనాగరికతకు చాల విపరీతముగా నున్నను యజమానిమాత్ర మవి చాల శ్రద్ధగను, ఆప్యాయముగను ధరియించి యున్నాడు. తలమీద నుండి పెదవులు దాటి గడ్డము వరకు దిగిన నల్లని పలుచని ముసుగుమాత్రము వాని ముఖమును, వర్చస్సును కప్పి గురుతు కనుపించకుండ దాని పని నదిచేయుచున్నది. దాని నత డప్పుడే ధరియించినటుల కనుపించుచున్నది. ఏమన నతడు లోపల ప్రవేశించునప్పటి కింకను వాని యెడమచేయి ముసుగుమీదనే యున్నది. వాని ముఖముయొక్క క్రింది భాగము అత డొక కచ్చితమైన మనోనిబ్బరము కలవాడనియును బలమైన వాని క్రిందపెదవియును, పొడుగైన గడ్డమును అతడు దేనికై నను చాల పెంకి పట్టుదల కలవాడనియును తోపజేయుచున్నవి.

అతడు చాల గంభీర స్వరమున "మీకు మా చీటి చేరియుండును? మేము వచ్చెదమని వ్రాసియుంటిమి" అని యిటునటు తల త్రిప్పి, ఆయిరువురిలో యెవరు ముఖ్యులో యెవరితో ప్రసంగించవలయునో తెలియక తటపటాయించినాడు.

అంతట పత్తేదారు "దయచేసి తమ రా యాసన మలంకరించుడు. వీరు నా మిత్రులును, సహకారియును. నా వ్యవహారములలో యవసర సమయములయందు నాకు చాల

పారులు తోడ్పడినారు. నే నిప్పు డెవరితో సంభాషించు భాగ్యము నాకలవడినదో విన కుతూహల పడుచున్నాను.” అన్నాడు.

“మీరు నన్ను పత్తేబాదు నవాబువారి కార్యదర్శి సర్దార్ సింగుగా సంబోధించ వచ్చును. నేను వారి యాంతరంగికులలో ముఖ్యుడ నని మీరు త్వరలోనే తెలిసికొనగలరు. మీ మిత్రులు, వీరు మర్యాద గలవారనియు, విశ్వాస ముంచదగినవారనియు నా నమ్మకము. ఏలనన నేను వెల్లడి పరచబోవునది చాలప్రముఖమైన సంగతి. లేక నేను మీతో నొంటరిగా మాటలాడిన బాగుండు ననుకొనియెదను.” అన్నాడు.

చక్రపాణిరావు తటాలున లేచినాడు. కాని సుబ్బరామన్ వానిని, భుజము పట్టుకొని యాపి కుర్చీలోనికి గెంటి “మీరు నాకు చెప్పబోవునది వీరి యెదుటనే చెప్పవచ్చును. సందేహించ నక్కరలేదు” అన్నాడు.

ఆ నూతనుడు కొంచెము హెచ్చరికగా “రహస్య గోపనమునకై మీ యిరువుర దగ్గర నుండియు—సుమారు రెండు సంవత్సరముల వరకు మాత్రము—ఆ తరువాత వెళ్ళడి యయినను ప్రమాదము లేదు—వాగ్దానము తీసికొని నాకథ ప్రారంభించెదను. ఈ లోపున నా సంగతి వెళ్ళడి యయినచో జమీందారీ సంస్థానములలో చాల యల్లకల్లోలము పుట్టునని

నేను చెప్పుటలో నతిశయోక్తి యెంతమాత్రము లేదు" అన్నాడు.

"అంత వరకు నేను వాగ్దానము చేయుచున్నాను." అన్నాడు పరిశోధకుడు.

"నేను కూడను" అన్నాడు చక్రపాణిరావు.

అంత నా వింతపురుషుడు "మీరు నా యీ మునుగునకు నన్ను క్షమించవలయును. నన్నీ పనికి నియోగించిన మా ప్రభువు నే నితరులకు తెలియరాకుండ నుండుట కభిలాష పడును. అందుచేత నే నిదివరలో మీకు తెలియపరచిన నామాక్షరములు నావి కావని నేను వేరుగ నొప్పుకొన వలసిన యవసరము లేదు." అన్నాడు.

"అంత వరకు మే మిదివరకే గ్రహించినాము." అన్నాడు పత్తేదారు మొగమోటము విడచి.

"వ్యవహారము చాల నున్నతమైనది. రంధ్రాన్వేషణ పరులగు మానవు లెవరికి నీ సంగతి తెలియకుండ నుండుటకై యన్నివిధముల జాగ్రత్తగ నుండుట మంచిది. లేనిచో మా ప్రభువువారికి సంబంధించిన జమీందారీ కుటుంబము లన్నియు నల్లాడి పోగలవు." అన్నాడు. సుబ్బరామన్ తాజుగా వడకకుర్చీలో జారబడి కన్ను లరమోడ్చి "అంతవరకు కూడ తెలియును." అని కులాసగా గొణిగినాడు.

ఆ నూతన పురుషుడు, కుర్చీలో నిర్మలముగా పరుండి యున్న ఆ ప్రజ్ఞావంతుని, ఆ యసాధారణ మేధావంతుని,

ఆ సుప్రసిద్ధ పత్తేదారుని దీక్షగా చూడసాగినాడు. సుబ్బ రామక్ నెమ్మదిగా కండ్లు తెరచి యెదుట నున్న గంభీరాకారుని విసువుగా చూచి "ప్రభువు వారు సంగతి స్పష్టపరచిన, నేను పీఠుగ నున్నంతవరకును, సలహా యొసంగ నవకాశ ముండు స్థితిలో నుందును." అన్నాడు.

ఆ నూతనుడంతవరకు కూర్చుని యున్న కుర్చీలోనుండి తృళ్ళిపడి లేచి, ఆ గదిలో వెనుకకు ముందునకు కంగారుగా తచ్చాడ సాగినాడు. కొంతసేపటికి నిస్పృహ చెందిన వాని లాగున యుద్రేకముగా ముఖమున నున్న ముసుగు లాగి క్రిందకు విసరికొట్టి "నీవు వచియించినది వాస్తవమే. నేనే జమీందారుడు. అవును. అదేల మరుగు పరచ వలయును!" అని తీవ్రముగా నన్నాడు.

"ఆహా! ఇంతవరకేల? నేను కుమార మహారాజా వారితో ప్రసంగించు చున్నటుల తెలిసికొనకపూర్వము తామది వెల్లడిపరచు మాట యేదియు ననలేదే!" అన్నాడు.

ఆ నూతనుడు చాల యుద్రేకముగా తిరిగి తన యాసనమున సరుదుకొని, కుడిచేతి వ్రేళ్ళతో తల తడుముకొనుచు, "మే మిదివరలో యిట్టి వ్యాపారముల కలవాటుపడిన వారము కా మని మీరు తెలిసికొన గలరు. వ్యవహారములోని సున్నితావస్థను బట్టి నేను యితరుల నెవరిని నమ్మలేము. అటుల చేసినచో వారి చేతులలో నిరుకుకొని పోవు ప్రమాదావస్థ తటస్థించును. మేము మా ప్రాంతములనుండి యింత దూర

మిచ్చుటకు చాల రహస్యముగా మారు రూపువనే వచ్చి యున్నాము" అన్నాడు.

మబ్బరామన్ కన్ను లరమోడ్చి "దయయుంచి సంగతి వ్యక్తపరచుడు!" అన్నాడు.

"క్లుప్తముగా సంగతిది. సుమారు, అయిదు సంవత్సరముల క్రితము, మేము సికింద్రాబాదు పోయి నప్పు డక్కడ సుప్రసిద్ధ నర్తకియైన జోరాజానీతో మాకు పరిచయము కలిగినది. ఆమె సంగతి మీరు వినియే యుందురు."

"ఆ విన్నాము. ఆమె యీ పట్టణములో రెండు మూడు ప్రదర్శనములు కూడ యిచ్చినది. ఆమె యీ మధ్య వ్యాపార మాపుచేసిన దని పత్రికలలో చూచిన జ్ఞాపకము కూడను. తమ రా వలపుకత్తె యురులలో చిక్కుకొని, ఆ రోజులలో నామెకు వివిధ వాగ్దానములతో వ్రాసిన దూరదృష్టి చాలని ఉత్తరములు తిరుగ సంగ్రహించ వలెనని యభిలాష పడుచున్నారు!" అని యడిగినాడు

"ఆహా! సరిగా అంతే. కాని యెట్లు."

"అగ్రిమెంటు యేమయినా ఉన్నదా?"

"ఊఁ ఉ. లేదు."

"అయితే మీ కిప్పుడు భయమెందులకో నాకు బోధ పడుట లేదు. ఆ చిన్నది మిమ్ము పాడుచేయు దురుద్దేశముతో గాని, మరియే యితర యుద్దేశములోగాని మీ యుత్తరములు

బయలుపెట్టు ననుకొనుడు. అవి ఋజువు పరచుట కామె కేమి యాధారము లున్నవి."

"నా దస్తూరీ!"

"ఛా! అది ఫోర్జరీ"

"నా సొంత యుత్తర కాగితములు!"

"దొంగిలించి నా రందుము"

"నా ముద్ర!"

"ఆ! అట్టిది మరియొకటి"

"నా ఫొటోగ్రఫ్!"

"ఫొటోగ్రాఫరు దగ్గర కొన్నారు"

"అందు మే మిరువురమును కలసి ఉన్నామే!"

"ఆహా! కొంప మునిగినది. తమరు చేసినది చాల దూర దృష్టి చాలని పని."

"అప్పుడు మాకు శరీరము తెలియదు. మతి లేదు"

"అయిన మీరు చాల ప్రమాదకరమైన చిక్కులో పడిపోయినారని చెప్పక తీరదు."

"అప్పటికి మాకు చాల చిన్నతనము."

"చిన్నతనవు పనియే. అది యెటులైనను తిరిగి సంపాదించ వలసినదే"

"మేము చాలవరకు ప్రయత్నించితిమి కాని, పని జరిగినది కాదు"

"మీరు యెంత సొమ్మయినను కర్చుపెట్టి—ఎంత కఠినదయినను పరే—కొని యుండవలసినది"

"ఆమె చచ్చినను అమ్మదది"

"అయితే దొంగతనమే"

"అదియు నయినది. అయిదారు ప్రయత్నము లయినవి. మా మనుష్యులు రెండు సారులు యిల్లు దోచినారు. రెండు మూడు సారు లామెను త్రోవలో నరికట్టి పెట్టెలన్నియు వెతకినారు. మాట దక్కినది కాదు"

"దాని జాడ లయినను కనుపించలేదా?"

"ఎంత మాత్రము"

సుబ్బారామన్ నవ్వి "ఇదిచాల తమాషా సమస్యయే" అన్నాడు.

"కాని నాకు మాత్రము చాల ప్రాణసంకటముగా నున్నది"

"ఆహా! చాల ప్రాణసంకటముని నెమ్మదిగా నను చున్నారా! కాని ఆఫోటోతో నామె యేమి చేయదలచుకున్నది?

"ఏమా? నా నాశనము"

"ఏలాగునా?"

"మా కీ మధ్య వివాహము కానున్నది"

"ఆలాగా? ఊఁ! అయితే!"

శ్రీ................వారి రెండవ కుమార్తెను మా కీయ నిశ్చయమైనది. జమీందారీ కుటుంబములలోని కట్టుబాటు మీకును తెలియును గదా! వధువు కూడ చాల యాత్మ గౌరవము కలది. నా యీ ప్రవర్తన యొక్క గాలి యే మా

మాత్రి మటు పీచినను వ్యవహారము గంగ గలసిపోవును."

" ఊ! జోరాజానీరియో!"

" ఫొటోగ్రా పక్కడకు పంపెదనని బెదరించుచున్నది. అంతవరకుచేయును. ఆ! ఆరకపుదే నది. అంతవరకు నాకు బాగుగా తెలియును. మీకు తెలియదు కాని దాని సంగతి, రాతిగుండె. అమె ముఖ మెంత మార్దవముగను, మృదువుగను, ఉండునో, హృదయమంత కఠినముగను, కరకుగను, ఉండును. నే నితరులను వివాహమాడ కుండ చేయుట కది యెన్ని ప్రియత్నములయినను చేయును. చేసియే తీరును. ఆ! ఎట్టి వయినను సరే" అన్నాడు.

" అయితే యింతవరకు పంపలేదని మాత్రము మీకు రూఢియేనా?

" అంత వరకు గట్టి నమ్మక మున్నది"

" ఎందు వలన?"

" ప్రధానము జరిగిన రోజున వెళ్ళడి పరతు నని వర్తమానించినది. అది పై సోమవారము" అన్నాడు జమీందారు.

"ఆహా! అయిన మన కిక మూడు రోజులు మాత్రము వ్యవధి యున్నది. అంతవర కదృష్టవంతులమే. ఈలోపున నేను తొందరగా ముగింపు చేసికొనవలసిన పనులొకటి రెండున్నవి. తమ రీ పట్టణముననే ఒకటి రెండుపూట లుందు రను కొనియెదను?" అని పరిశోధకుడు ప్రశ్నించినాడు.

"ఆహా! తప్పకుండ మీరు నన్ను సర్దార్ సింగు పేరున

ఆనంద భవనమున చూడ గలరు. ఎప్పుడైనను సరే"
అన్నాడు.

"సరే ముందుసంగతి యవసరమును బట్టి తమకు సాధ్య మయినంత త్వరలో తెలియపరచ గలను."

"తప్పక తెలియపరచవలయును అశ్రద్ధ చేయకుడు. నాకు చాల యాత్రముగా నుండును."

"ఆహా! తప్పకుండ. కాని ....."

"ఆహా! డబ్బుసంగతియా? మీా రేదికోరిన నది"

"అనగా స్పష్టముగా......"

"నా జమీాందారిలో మీారు కోరిన గ్రామమిచ్చి వేయుదును. ఆ ఫోటోగ్రాపు సంపాదించవలయును గాని"
అన్నాడు.

"సరే మీా చిత్రము"

"ప్రస్తుతము కర్చుకు" అనుచు జమీాందారు వాని కోటు లోపలి జేబునుండి పలుచని వెండి డబ్బాయొకటి వెలుపలకు తీసి దానిలోని నోటుల కట్ట బల్లమీాద కొట్టినాను.

"అందులో సుమారు రయిదువందల వర కున్నవి. ప్రస్తుతము......" అన్నాడు.

సుబ్బరామయ్య చేతి పుస్తకములోని కాగితముమీాద రసీదువ్రాసి వలదనుచున్నను బలవంతముగా వాని చేతికిచ్చినాడు.

"తరువాత-ఆవిడ విలాసము?" అన్నాడు.

"ఆహా! అవును" అని జమీందారు జేబులోనుండి కాగిత మొకటి తీసి దాని మీద వ్రాసి వానిచేతి కిచ్చినాడు.

సుబ్బరామ నదియందుకొని చూచి "మరియొకమాట. ఫోటోగ్రాఫు, 'కేబినెటు' సైజేనా?" అని యడిగినాడు.

"ఆ"

"సరే సెలవు. అచిరకాలముననే మీకొరకు మంచి వర్తమానము సంపాదించగల ననుకొనియెదను." అన్నాడు.

ఆ నూతనుడు తొందరగా మేడీలు దిగి వెడలిపోయి నాడు. చక్రపాణిరావు కూడ వెడలిపోవుటకై లేచినిలచినాడు.

"ఇదిగో! అబ్బాయి! నీవు కొంచెము శ్రమ యనక రేపు మధ్యాహ్నము మూడు గంటల కొకసారి యిక్కడకు రావలయును. ఆ. తప్పదు. దీనిని గురించి నీతో కొంత ప్రసంగించవలసి యున్నది. మరవిపోకు సుమా!" అన్నాడు పత్తేదారు.

౨

మరుసటి దినము మధ్యాహ్నము మూడుగంటలకు సరిగా, అనుకొనిన ప్రకారము చక్రపాణిరా వక్కడకు వచ్చినాడు. గృహయజమాని యింటెదగ్గర లేనందున నతడు సిగరెట్టుఅంటించి చావడిలో నొంటరిగా కూరుచున్నాడు. నవు కరు వచ్చి యజమాని యుదయ మెనిమిది గంటలకే, ఒంట రిగాబయలుదేరి యెక్కడకో వెళ్ళినాడనియు, అంతవరకు రాలేదనియు చెప్పినాడు. అది వానికి క్రొత్తగాదు. అట్లు

వెళ్ళి రాత్రి మీరిపోయినను రాకపోయిన సమయములు చాల గలవు.

మన చక్రపాణిరావటులనే కూర్చుని పరధ్యాన్న ముగా సొంత గొడవ కొంత యాలోచించుకొన సాగినాడు. సుమారు నాలుగు గంటలు సమీపించునప్పటికి గురిపువాని వేషమున బీదవాడొకడు గుబురుగానున్న బుగ్గమీసములతో, చినిగిన గుడ్డలతో దరిద్రావస్థను ప్రదర్శించుచు, తాగిన వాని లాగున తప్పటడుగులు వేయుచు తలుపు తెరచుకొని లోపల ప్రవేశించినాడు. ఆ పత్తేదారుని కృత్రిమపు వేషము లకు బాగుగ నలవాటు పడిన వాడయినను ఆ వచ్చిన దతే డేనని స్థిరపరచుకొనుటకు చక్రపాణిరావు వానివైపు రెండు మూడు సారులు దీక్షగా చూడవలసి వచ్చినది. పత్తేదారు వెంటనే ప్రక్కగదిలోనికి పోయి మరి పదినిమిషములలో, శుభ్రమైన దుస్తులు ధరియించుకొని చావడిలో కుర్చీలో కూరుచున్నాడు. నెమ్మదిగా సిగరెట్టు అంటించి తన్నాశ్చ ర్యపూర్వకముగా చూచుచున్న చక్రపాణిరావు వైపు తాజుగా చూచి పెద్ద పెట్టున నవ్వినాడు.

"ఆహా! నిజముగా......" అని నవ్వు ఆపుకొనలేక వెనుకకు పడకకుర్చీలోనికి విరగబడి మరల మరల నవ్వ సాగినాడు.

"సంగతేమనలు? ఎందు కంత నవ్వు!"

"చాలా తమాషగా ఉన్నది. నేనీవేళ పొద్దు

టనుండియు యేమిచేసితివో యెరుగుదువా? చివరకది యేలా-గున పరిణమించినదో నీ వేమైన చెప్పుకొనగలవా మరి?" అని పరిశోధకుడు చమత్కారముగా ప్రశ్నించినాడు.

"నే నెంతమాత్రము చెప్పుకొనలేను. కాని జోరాజానీ వ్యవహారములో పోయి, యింటిచుట్టు ప్రదక్షిణచేసి వచ్చితివని మాత్రము చెప్పగల ననుకొనియెదను. దర్శనమైనదా?" అన్నాడు వెటకారముగా.

"ఆ!"

"'ధన్యోస్మి' అన్నావా?"

"అవ్వాడే. ఇంకను చాలగ నున్నది ధన్యోస్మి అనుటకు. జరిగిన సంగతంతయు విను. నీవు న న్నింతకు పూర్వము చూచిన గుర్రపువాని వేషములో నేను సరిగా ఉదయ మెనిమిది గంటలకు యిల్లువిడచి బయలుదేరి యక్కడకు పోయినాను. గుర్రపువాండ్రకు అన్యోన్యాభిమాన మెక్కువ. నీ వా వేషమున పోయి చూడు. నీకు వార్ల మూలమున కావలసినంత సమాచారము తెలియగలదు. నేను తిన్నగా జోరాజానీ యున్న యింటికి పోయినాను. అది యొక పెద్ద మేడయిల్లు. వెనుక విశాలమైన పువ్వుల తోట. ముందుకూడ రకరకముల పువ్వుల మొక్కలు. ఇదంతయు నొక పెద్ద యావరణలో నున్నది. ముందు యింటికి వీధి గుమ్మము దాటి లోపలకు

పోయిన యెడమవైపున నున్న హాలులో పుస్తకముల బీరువా వగయిరాలున్నవి. కుడివైపున నేలమట్టము వరకు దిగియున్న పెద్ద కిటికీలు గల విశాలమైన యొక కచేరీ చావడి యున్నది. దాని వెనుక నేదియు లేదు. నేను దాని నాలుగు ప్రక్కల తిరిగి పరిశీలించి చూచినాను గాని మన కవసరముండున దేదియు కనుపించలేదు.

"తరువాత నా సందులో నటునిటు పచారుచేయుచుం డగా నొక గుర్రపుసాల కనుపించినది అక్కడి ద్దరు ముగ్గురు గుర్రపువాండ్రు గుర్రములకు మాలీసు చేయుచున్నారు. నే నంత వారి చెంతకు పోయి పరోపకారివలె వారికి సహా యము చేయ ప్రారంభించినాను. వారితోటి చాకిరీ నా కెంతమాత్రము సహ్యమైనదికాదు. నేను చేసిన చాకిరీకి వారు నాకు కొంత ముట్ట చెప్ప ప్రయత్నించినారు కాని నేనే పుచ్చుకొనక నిరాకరించినాను. పని కోసము వచ్చినానని యెక్కడనయినా పని యిప్పించుమని అడిగినాను. కాని వారి దగ్గరనుంచి మాత్ర మా చుట్టుప్రక్కల యిళ్ళవారల సంగతి సమచారము లడుగుచూ దానితో పాటు మన జో రాజానీ సంగతి కూడ తెలిసికొన్నాను. అందులో ననవసరముగా నలుగు రయిదుగుర గొడవ యిష్టములేక పోయినను వినవలసి వచ్చినది. వినక తీరినదికాదు. లేకపోయిన దొరకిపోతానన్న భయమున యేదోవిధముగా 'ఊ' కొట్టుచు జో రాజానీ సంగతి

మనకు కావలసినంత వరకు సంగ్రహించినాను"

"జో రాజానీ సంగతేమి?" అని యాత్రముగా నడిగినాను.

"ఆహా! ఆమె చాల యసాధ్యురాలు. తెలివి తేటలు గలది. ఆ చుట్టుప్రక్కల వారినందరను స్వాధీనము చేసికొన్నది. అంతటి చమత్కారి మరియొకతె లేదు. నిర్మలమైన జీవితము. ఒకరి జోక్యమునకు పోదు. సాయంత్రమైదు గంటలకు షికారు పోవును. ఏడు గంటలకు తిరిగి వచ్చును. సొంతముగా గుర్రపు బండి పెట్టుకున్నది. ఎప్పుడైనా తగిలితే సంగీతసభలు చేయును-బాగా కట్టినప్పుడు. పగ లెక్కడకును పోదు. ఇంటికెవ్వరును రారు—ఒక్కరు తప్ప. ఆయనయే తరచు రాకపోకలు. అధమము రోజు కొకసారి యయినను వచ్చును. అతడు చురుకైన వాడు. సాహసిక స్వభావుడు. అందముగా చామన చాయనుండును. నాగపూరు నివాసియట. చూచితివా! గుర్రపువాండ్రి స్నేహము. వారు వానిని నాలుగయిదు సారు లామెబండిలో తీసికొని వచ్చినారట. మకాము కూడ చెప్పినారు. ఈ సంగతంతయు విని ముందు సంగతేమని యాలోచించుచు వీధిలో యిటు నటు రెండు మూడు సారులు పచారుచేసినాను.

"అతడన్ని సారులు వచ్చి పోవుట యెందుకని యాలోచించినాను. అంతరంగికుడయినచో తన దగ్గర జాగ్రత్తగా నుండదని 'ఫోటో' వాని కిచ్చిన దేమో నని సందేహించినాను. అలాగయినచో యీ యిల్లు విడిచిపెట్టి అక్కడ వానియిల్లు

వెతకవలసి యుండునని భ్రమ పడినాను. కాని—నీ కీ సంభాషణ యంతయు వినవుగా నున్నట్టు లున్నది.

"లేదు. లేదు. నేను శ్రద్ధగనే వినుచున్నాను."

"ఏమి చేయుటకును తోచక తటపటాయించినాను. అంతలో నందమయిన మోటారొకటి స్వయముగా నడుపుకొని వడుచు వాడొక డక్కడకు వచ్చి సరిగా జోరాజానీ యింటి ముం దాగినాడు. వాని వాలకమును పట్టి నే వినినవాడతడే యైయుండు నని అనుకొన్నాను. చాలా మంచి విగ్రహాము. అతడు బండిదిగి జోరాజానీ యింటిలోనికి సొంత యింటిలోనికి పోయినటుల పోయినాడు. చాలాతొందరగా నున్నట్టుల కనుపించినాడు.

"అత డింటిలో సుమారొక యరగంట నేవున్నాడు. కిటికీలోనుండి వాని విగ్రహాము కనుపించుచునే యున్నది నాకు. అత డిటు నటూ తిరుగుచు చేతులు ముందునకు వెనుకకు నూపుచూ తీవ్రముగా మాటలాడుచు ఒకసా రామెను బిగ్గ కౌగలించుకున్నాడు. అతడు వెంటనే వెలుపలకు వచ్చినాడు. మొగము యెఱ్ఱవారియున్నది. అది వరకు కన్న యెక్కువతీవ్రముగా కనుపించినాడు. మణికట్టుమీదనున్న గడియారము వైపు చూచి కారులోనికి దుమికి వెనుక ముందు చూడకుండ మహావేగముగా బయలుదేరినాడు. సంగతేమిటో నాకు బోధపడినది కాదు. నేను తెల్లబోయి చూడసాగినాను.

వెంటనే లోపలినుండి జోరా వచ్చినది. కంగారుగా నిటూ నటు చూచినది. అంతలో నామె గుఱ్ఱపుబండి వచ్చి గుమ్మము దగ్గ రాగినది. బండి యాగియు యాగుటలో నామె యాబండిలో పడి పట్టణము చివర సముద్రపు వారనున్న తోట బంగాళా దగ్గరకు వాయువేగమున పోనీయుమన్నది. 'పది నిమిషముల లో తీసికొని పోయిన మంచి బహుమానము' అన్నది. బండి కదలుచున్నది. నా కేమియు తోచినదికాదు. దాటబెట్టుటకు ప్రాణమొప్పినది కాదు. ఏమయినను సరే. ఆలోచించిన లాభ ములేదని నేను నెమ్మదిగా బండివెనుక నున్న చెక్కమీద చేరి నాను. దొరకిన యవకాశము పోనిచ్చినయెట్లాగు?

"బండి మహాతీవ్రముగా పోయి గమ్యస్థానము చేరినది. ఆగియు నాగుటలో క్రిందకు దుమికి ప్రక్కకు చేరి ముందు నకు సాగిపోయి యాలోచనలో పడినాను. అప్పటి కప్పుడే యిద్దరు పెద్దమనుష్యు లక్కడ నున్నారు. ఒకరు మనకు ప్రాత పరిచితులే. రెండవయాతడు వకీలు. వాని కొరకే మనమిత్రుడు ముందుగపోయి వాని నక్కడ హాజరు పెట్టినాడు. ముగ్గురు లోపలకు పోయినారు. నేను దాహాము వేసిన వానిలాగున విను గు కొనుచు నటునిటు తిరిగి నూతిదగ్గర చేరినాను. అప్పుడు సుమారు పండ్రెండు గంటలు కావచ్చినది. వారు ముగ్గురును తప్ప మరియెవ్వరు లేరక్కడ. మరి యయిదు నిమిషములలో నాగపూరు మనుష్యుడు కంగారుగా నా కోసము నూతిదగ్గరకు

వచ్చినాడు. మతిచలించిన దనుకున్నాను. చాలా యాశ్చర్యపడి నాను.

"ఏయి! మాట. మాట. త్వరగా రా యీలాగు" అన్నాడు నావైపుతిరిగి.

"ఎందుకు బాబూ? అన్నాను"

"నీవు చదువుకున్నావా? అని అడిగినాడు"

"అంతగా సదువుకోలేదు. సొంతకం మాత్రం సేస్తా నన్నాను"

"అతడు చాల యానందముగా "ఓ! అయిన మరియు మంచిది. అదృష్టవంతుడనే. రా త్వరగా! ఊరక పోదులే. ఆ మాత్రమున్న చాలును' అన్నాడు."

"ఏమి? సంగ తేం టసలు, అని అడిగినాను."

"రా! రా! ఆలశ్యము చేయకు. త్వరగా జరిగిపోవలెను." అని చెప్పుచు జెబ్బ పట్టుకుని నన్ను బలవంతముగా యీడ్చు కొని పోయినా డతడు.

"నేను పోవునప్పటి కక్కడ కాగితముపరచుకొని జో రా జానీ దీక్షగా చూచుచున్నది. వకీ లామె కేదియొ స్పష్టపరచి చెప్పుచున్నాడు. నేను వెళ్ళగనే వారు నన్ను చూచి తటపటా యించినారు. కాని నేను వ్రాలుదారు నే నని తెలిసికొనిన తరు వాత సంతసించి న న్నా కాగితముమీాద సంతకము చేయు

మన్నారు. ఆ నిమిషమున నాబుర్రలో పడిన పేరేదియో సాక్షి వ్రాలుగా నే నా కాగిత మెక్కించినాను.

"ఆ కాగితమే మసలు" అని చక్రపాణిరా వడిగినాడు.

"అదా? అది 'అగ్రిమెంటు' ఆనూతనుడును జోరాజానీ యును కలసి జీవయాత్ర నడుపుట కేర్పడినది. అందు నేను...

"ఆహా! అలాగుననా? సరే. ఇక నేమి?"

"నన్ను చూచి వా రిరువురును సంతోషించినారు కాని వకీలునకు మాత్రము సందేహము వదలినది కాదు. ఆమె నా కష్టమునకై నా కొక యయిదు రూపాయల నోటిచ్చినది. నే నది జ్ఞాపకార్థము నా జీవితకాల మంతయు జాగ్రత్త పెట్టవలసినదే. కాని యా స్థితిమాత్రము నాకు చాలవిరుద్ధముగా కనుపించినది. అది జ్ఞాపకము వచ్చి నా కింత నవ్వు వచ్చినది."

"సరియే కాని వ్యవహారము చాల వింతత్రోవ పట్టినదన్న మాట. ఇక చేయవలసిన దేమి?" అని చక్రపాణిరా వడిగినాడు చాల యాత్రముగా.

"నా ప్రయత్నములన్నియు భగ్నమగులాగున కనుపించినది. ఈ సంగతి చూడగా వారిచ్చటనుండి త్వరలోనే పోవులాగున కనుపించినది. అందుచేత మన మెంతమాత్రి మూలశ్యము చేయకుండ చాల చురుకుగా పనిచేయవలసి యున్నది. వెలుపలకు వచ్చి వా రిరువురును, బండ్లలో చెరియొక త్రో

తను పోయినారు. నేను మాత్రము కమపు కాల్చుకొని, కాళ్ళీ డ్చుకొనుచు యీలాగున వచ్చినాను ముందు ప్రియత్నము కోసము."

"ఏదది!"

"అరడజను దోసెలు, కప్పున్నర కాఫీని. ఈవేళ ప్రొద్దు టనుండియు తిండి గొడవయే లేదు. ఇక ముందుకూడ రాత్రి వరకు సావకాశ ముండదు. అది యిది కూడ యిప్పుడే పట్టివే యవలసియున్నది. కాని నీవు నా కిందులో కొంచెము సహా యము చేయుదువా?"

"ఆహా! కావలసినంత."

"చట్ట ధిక్కార మయినను సందేహించవా?"

"ఉహు. ఊ. ఎంతమాత్రము"

"తగువులో పడినను సరే."

"ఆ! ధర్మకార్యమైతే సరి."

"సెహబాస్! కావలసి నంత ధర్మ మున్నదిందులో."

"అలాగయిన నీ చిత్తము వచ్చినటుల చేయుదును, నాకు నీ యందు విశ్వాసమున్నది."

"అయితే నేను నిన్ను నమ్ముకొని యుండవచ్చునన్న మాట. అవునా?"

"అలాగే కాని,నీవు చెప్పనదేమి? ఏమిచేయవలయును."

"ఋణమాగుము. కడుపులో నేమైనపడనిమ్ము. మాట బయటకు రావలయునా!"

అని ఫలహారము తెప్పించి ముందుపెట్టుకొని "ఇదిగో! ఇవి తినుచూ నేను నంగ తంతయు బోధపరచెదను. తరువాత నాకు సావకాశము చాలదు. మరి రెండు గంటల కాలములో మనము జోరాజానీ యింటికి పోవలయును. ఆమె షికారునుండి సర్వసాధారణముగా రాత్రి యేడుగంటలకు వచ్చుచుండును. ఆమెను కలిసికొనుటకు మనము సరిగా నావేళ కక్కడుండవలయును."

"సరే తరువాత"

"అదంతయు నాకు విడిచిపెట్టుము. దానికి కావలసిన యేర్పాటులన్నియు నిదివరకే సిద్ధపరచి ఉంచినాను. నీవు చేయవలసిన దొకటి మాత్ర మున్నది. అంతకు మినహా యేమివచ్చినను సరే. నీవు మాత్రము కలుగచేసికొన నక్కర లేదు. తెలిసినదా?

"నేను పరస్పరముగా నుండవలసిన దేనా!"

"ఆహా! అంతకన్న వేరేమియుకూడదు. అక్కడ బహుశా చిన్న యల్లరి జరుగగలదు. నీవందు చేరకూడదు. ఆ యల్లరిలో నన్ను లోపలకు మోసికొని పోవుదురు. 4, 5 నిమిషములలో చావడి కిటికీ తలుపు తీయుదురు. నీ వా కిటికీ దగ్గరగా చేరవలెను."

"ఊఁ!"

"ఆ కిటికీలో నుండి నన్ను కనిపెట్టి చూచుచుండవలెను. నేను నీకు యెదురుగనే ఉందును".

"ఊఁ!"

"నేను లోపల చేయి యెత్తి సంజ్ఞచేయగనే నే నిప్పుడు నీ చేతికిచ్చునది లోపలకు విసరి, "ఇల్లు అంటుకున్నది." అని బిగ్గరగా కేకలు వేయవలెను. తెలిసినదా! సరిగా!"

"ఆహా! పూర్తిగా."

అంతట పత్తేదారు జేబునుండి ఆరు అంగుళముల పొడవుండు గుండ్రని గొట్టమొకటి వెలుపలకు తీసి "ఇందు కష్టమేమియును లేదు. ఇది రెండు ప్రక్కల మూత బిగియించబడిన పొగగొట్టము. నీ పని యంతయు దీనితో నున్నది. నీవు అగ్నిప్రమాదమని కేకలు వేయగనే యా కేకలందుకొని నీతో పాటు కేకలు వేయువా రక్కడ చాలమంది యుందురు. నీవు వెంటనే వీధి చివరకు పోయి నేను వచ్చువర కక్కడ తూముదగ్గర కనిపెట్టుకొని యుండుము. నేను వచ్చి నిన్ను పది నిమిషములలో కలసి కొనియెదను. సంగతంతయు నిప్పుడు స్పష్టముగా కనుపించుచున్నదా?" అని కచ్చితముగానడిగినాడు.

"అనగా, నేను పరస్పరముగా ఉండి, కిటికీదగ్గరకుపోయి, నీ కొరకు కనిపెట్టుకొని, నీవు చేయి విసరగనే యా గొట్టము

లోపలకు విసరి, యిల్లంటుకొనిన దని కేకలు వేసి, మిగత వారికి ఉప్పు అందించి వీధి చివర నీ కోసము కనిపెట్టికొని ఉండవలెను, అంతేనా!" అని అడిగినాడు తాజుగా.

"ఆహా! సరిగా అంతే."

"అయిన నీ వంతవరకు నాపై పూర్తిగా నమ్మకముంచ వచ్చును."

"సెహబాస్. ఇంత వరకు చాల ప్రశస్తముగానే యున్నది. మన మిక మన పనిమీద బయలుదేర వచ్చును"?

పత్తేదారు లోపలకు పోయి కొలదికాలముననే ఒక పకీరు వేషమున వెలుపలకు వచ్చినాడు. వాని జేగురు రంగు గడ్డము, తెల్లని అంగరఖా, మెడలోని వివిధరంగుల పెద్దపూసల హారములు, ఆ జాలి కనబరచు నేత్రములు, ఆ వినయము, ఆ విధేయత, ఆతి డప్పుడే మక్కా, మదీనాల నుండి తిరిగి వచ్చిన యొక గొప్ప మహామ్మదీయ ప్రవక్తయని తోపజేయుచున్నవి. దుస్తులే గాక వాని నడక, హావ భావ చేష్టలు, వానికి

సరిగా నరిపోయి వాని బహిర్వేషమునే గాక యంతరాత్మను కూడ మార్చివేసినటుల కనుపించుచున్నవి.

వారు గమ్యస్థానము చేరునప్పటికి సుమారు 6 గంః45 నిమిషములు కావచ్చినది. నియమిత సమయమున కింకను 15 నిమిషములు తక్కువగా నున్నది. అప్పటి కప్పుడే కనుచీకటి పడుచున్నది. దీపము లొకటి తరువాత నొకటిగా నక్కడక్కడ బయలుదేరుచున్నవి. మన మిత్రద్వయ మా యింటి యజమానురాలి కొరకా యింటి ముందు తచ్చాడ సాగినారు. ఇల్లంతయు బాగుగనే యున్నది గాని, వీధి మాత్రము మారుమూలగా నున్నది. చాల ఖాళీగా నున్నది. కాని, వీధి చివర మాత్రము కొందరు చింకిగుడ్డల వారు చుట్టలు వగయిరాలు కాల్చుకొనుచు, వికారముగా నెకసక్కెములాడు కొనుచు కూరుచున్నారు. మరి కొందరొక చోట గుంపుగా చేరి యొక పడుచుపిల్లతో వేళాకోళ మాడుచున్నారు. కొందరు మంచి వస్త్రములు ధరియించి మీసములు వడివేయుచు ఇటునటు పచారు చేయుచున్నారు.

మనమిత్రు లిరువు రచ్చటకు పోవునప్పటికి పత్తేదారు "చూచితివా! జో రాజానీ యొక్క నేటి వ్యాపారము మన పనిని తేలిక పరచుచున్నది. ఏమన నామె స్వాధీనములో నున్న ఫోటోగ్రాఫున కిప్పుడు రెండు ప్రక్కల వాడి కలిగినది. ఆఫోటో గ్రాఫనిన మన జమీందారున కెంత భయమో యామెకు నంతి

దేం భయము. అది యామె నూతన ప్రియుని కంట పడుట కామె యిష్టపడదు. కాని మనకా ఫోటో ఎక్కడ లభించగ లదో!" అన్నాడు.

"నిశ్చయముగా అది ఎక్కడ దొరుకునో!"

అది 'కేబినెట్టు' సైజగుట వలన నామె నిత్యము బట్ట లలో దాచి వెంట తీసికొని పోవుటకు వీలుండదుకదా! అది కాక జమీందారుని యనుచరులు రెండు మూడు సారు లామె ను త్రోవగొట్టి వెతికినారు కూడను. అందుచేత యామె వెంట నుండదన్నమాట.

"అయితే మరెక్కడ?"

"ఇతరులను నమ్మియిచ్చునా? అ దెంత మాత్రమును వీలు పడదు. ఏ యాడుదియు తన వస్తువును తాను జాగ్రత్త పరచుకొనును గాని ఒకరిని నమ్మ యీయదు. అందులో నూ అంత ప్రియమైన, యవసరమైన వస్తువు యితరుల కసలే యీయదు. అదియును గాక కొలది రోజులలోనే దాని యవ సరము రానైయున్నది. అందుచేత తనకు దగ్గరగనే సిద్ధపర చుకొని యుండును. కావున నెన్నివిధములచూచినను యింటి లోనేయుండునని నానమ్మకము" అన్నాడు.

"రెండు సార్లు దొంగలచే వెతకించి నపుడు కనపించ లేదే?" అని అడిగినాడు.

"ఛా. వార్ల కసలు వెతకవలసిన పద్ధతియే తెలిసినది కాదన్నమాట."

"అయితే నీవుమాత్రమేలాగున వెతకుదువు?"

"నే నసలు వెతకనే వెతకను."

"అయితే మరి?

"ఆమె తనంత తాను నాకు చూపించులాగున చేయుదును"

"ఆమె చచ్చినా గొంతుక కోసినా చూపించదు నీకు'

"ఉహూ ఊ. అంతవరకు చేయుటకు సాహసించను. ఆహా! అదిగో బండిచప్పుడు, గంటకూడ వినుపించుచున్నది. నేను చెప్పినది మాత్రము మరచిపోకు సుమా కొంపతీసి"

అంతలో బండిలాంతరు వెలుతురు వీధిమలుపుదాటి వారిమీదను యావీధినున్న మిగతవారిమీదను ప్రసరించినది.

మంచి అందమైన బండి గుమ్మములో నాగినది.

బండి యాగియు యాగుటలో బండితలుపు తెరచిన నేమైన దొరకగలదనిన యాశతో కాబోలు నక్కడ చేరిన దరిద్రులలో నొకడు చంగున ముందునకు వచ్చినాడు. అంతకన్న దరిద్రుడొకడు వానిని వెనుకకు గెంటి తాను ముందునకు వచ్చినాడు. అట్లనే మరియొకడు—మరియొకడు—చివరకందరును. వారిలో వారికి గెంటులాట వచ్చి తగువు ముదిరినది.

దగ్గరనున్న వా రందరేదరెయొ యొక్క పతిమూని దోహదము చేసి, ఆతగువును చిన్న యుద్ధముగా మార్చినారు. బండిలో నున్న కాంత క్రిందకుదిగునప్పటి కామె యా దొమ్మిమధ్య చిక్కుపడినది. తగువులాట చేతులుదాటి క్షణములో కర్రలలో నికి దిగి తీవ్రముగా కొట్టులాటలో పడినది. చేరువనే మారువే షమున నున్న సుబ్బరామ నాకాంతను రక్షించుటకై తొందరగా ముందునకు వచ్చి దొమ్మిలో పడి యామెను సమీపించి కెవ్వున కేక వేసి క్రిందపడిపోయినాడు. మొగమంతయు రక్తముతో నిండిపోయినది. ఈ దృశ్యమును చూచినంతనే యక్కడచేరిన యా తుంటరిసంగములోని వారందరును తల కొక వైపునకు పారిపోయినారు. ప్రక్కనుండి సంగతంతయు కనిపెట్టి

---

# భట్టివిక్రమార్కులకథలు

ఆంగ్ల, తమిళభాషా గ్రంథముల ననుసరించి సలక్షణ గ్రాంథికాంధ్రమున వ్రాయబడినకథల సంపుటము. శృంగార రసభరితములగు కథ లనేకమిందు వ్రాయబడినవి. విక్రమార్కుని సాహసములు, భట్టి బుద్ధి కౌశలము, భేతాళుని మహోపాయము లిందు చక్కగ వ్రాయబడినవి.

వెల 0—8—0.

శ్రీ కృష్ణా బుక్ డి పో, రా జ మ ం డ్రి.

చూచుచుండిన శుశ్రూషకన ధారుళైత వారు కంగారుగా దగ్గరకువచ్చి యామెనురక్షించిన యావకీరునకుసాయపడసాగినారు. జోరా తొందరగా చీడీలపైకి పోయి వెనుకకు తిరిగి చూచినది. ప్రజ్వలించుచున్న దీపపుకాంతిలో నామె ముఖము చూపరుల కశ్చర్యపు గొలిపినది.

"పాప మా పకీరునకు ప్రమాదకరమైన గాయము దగిలినదా" అని యడిగిన దామె.

"వాడు చచ్చినాడు" అని కొన్ని కేకలు వినుపించినవి

"ఆహా లేదు. లేదు. ఇంకను కొంచె మూపిరి యున్నది. కాని మీరు ఆసుపత్రికి మోసికొనిపోవునంతలో నాకా స్త పనియు జరుగగలదు." అని మరియొకడు తొందరగా నన్నాడు.

అంత నొకయాడుది "అమ్మో. అతడు సాల సారవైన మనిసి. లేకపోతే ఆ తుంటరులామె నెంతవనైనా నేసేదే. ఆళ్ళంతా తుంటరి ముండా కొడుకుల్లా వున్నారు. అమ్మా! అ యయ్య వూపిరి వదులుతున్నాడు పాపం యిప్పుడు" అన్నది.

"ఇత డిక్కడ నడివీధిలో పడి యుండుట చాలకష్టము అమ్మా! వీనిని లోపలకు తీసికొని వచ్చేదా?"

సంగతంతయు చూచుచు నిలుచున్న జోరాజానీ యాప్యాయముగా "ఆహా తప్పకుండ. ఈ కచేరీచావిడి లోనికి తీసి

కొనిరండు. ఇక్కడ సోఫా చాలసౌఖ్యముగానుండును. ఈలా గున తీసికొని రండు పావము త్వరగా" అన్న దామె.

వారు చాల నెమ్మదిగను జాగ్రత్తగను పకీరును చేతు లమీద లోపలకు తీసికొనిపోయి సావడిలోని సోఫాలో పరుండబెట్టినారు. దీపములు వెలుగుచున్నవి. కాని కిటికీతలు పులు గాని, వాటి తెరలు గాని, తీసియుండలేదు. ఈ వింత నాటకమునకు మూలకారణుడైన సుబ్బరామను మనసున కేటు లతోచినదో కాని వెలుపలనుండి సంగతంతయు చూచుచుం డిన చక్రపాణిరావు మనసునకు మాత్రము చాలబాధగను సిగ్గుగను ఉన్నది. కాని యంతవరకు వచ్చినతరువాత వెనుకడు గువేయుటకన్న చిన్నతనము గాని పిరికితనముగాని వేరొకటి కనుపించదని వాని యభిప్రాయము. అదిగాక వా రామె కేవిధ మైన హానియు తలపెట్టలేదు కదా! ఆమె యితరులకుచేయు నున్న యుపచారమును ప్రతిఘటించు చున్నారు. అందుదోష మేమున్నది. అందుచేత చక్రపాణిరావు జేబులోని గొట్టము తీసి పట్టుకుని సిద్ధముగానున్నాడు.

ఇంతలోసుబ్బరామరెమ్మతిరిగి బాధనటించు చునెమ్మ దిగా లేచికూర్చునిగాలికొరకుసంజ్ఞచేసినాడు. ఒకనవుకరదిగ్రహిం చితొందరగా కిటికీతలుపుపూర్తిగా తెరచినాడు. అతడునుచేయి విసరినటులకనుపించినది. వెలుపల సర్వసిద్ధముగా నున్న చక్రపా

ణిరావు చేతిలోనిగొట్టము మూత విప్పి, లోపలమూల వడు నటుల నూటిగా విసరి "అంటుకున్నది. ఇల్లంటుకున్నది" అని బిగ్గరగా నరచినాడు కేక వానినోటనుండి బయలు వెడలుట యే తరవాయిగా చెంతను చీకటిలో యిటు నటు తచ్చాడు చున్న మిగతవారందరు—దరిద్రులు-మంచివారు, ఆడువారు-మగవారు—అందరును మెవరంతట వారు అదేవిధముగా పెద్ద పెద్ద కేకలు వేయసాగినారు. అప్పటి కప్పుడే చుట్టలు చుట్టలుగా బయలు దేరిన పొగ చావడి యంతయు కమ్మివేసినది. ఇంటిలోని వారందరు మతులుపోయి కంగారుగా నలుప్రక్కల పరుగులిడ నారంభించినారు. సంగతంతయు కనిపెట్టి చూచు చుండిన సుబ్బరామన్ తాను వచ్చిన పని నెరవేరినందున "అది నమ్మదగినదికాదు, మోసము" అని నెమ్మదిగా నని లేచినాడు.

మరి పదినిమిషములలో సుబ్బరామన్ వీధి చివర తన కొరకు కనిపెట్టుకొనియున్న చక్రపాణిరావును కలిసికొని కులాసగా నెమ్మదిగా నిశ్శబ్దముగా కొంతవరకు నడచి, తరువాత తొందరగా యింటిత్రోవ బట్టినాడు.

"ఆహా! నీవు చాల బాగుగ చేసితివోయి! నాటకమింత బాగుగా జరుగునని నే ననుకొన లేదు సుమా. చాల తమాషగా జరిగినది" అని సుబ్బరామను సంతోషించ సాగినాడు.

"ఫోటోగ్రాఫ్ దొరకినదా? అది చెప్పు అసలు సంగతి?" అని చక్రపాణి గా వాత్రముగా నడిగినాడు.

"లేదుగాని అదియెక్కడ నున్నదో నాకు తెలిసినది."

"నీ వే లాగున తెలిసికొన్నావు?"

"నాకు చూపించినది. నాకామె చూపించుననని నే నిది వరకే చెప్పితిని కదా నీతో!"

"నే నింకను అంధకారముననే ఉన్నాను."

"అంధకారమేమి? సంగతిది. అందులో రహస్యమేమియు లేదు. ఆ వీధిలోని వారందరు మనతో నేకీభవించిన వారలే. అంత వరకు నీ వెరుంగుదువు కదా! వారినందర నీ సాయంకాలమునకు కుదిర్చినాను."

"ఆ! అంతవరకు గ్రహించినాను. తరువాత."

"నరే అల్లరి బయలుదేరి దొమ్మి జరుగునప్పటికి నా యరచేతిలో యెఱ్ఱని రంగున్నది. నేను తొందరగా ముందునకు పోయి, యీ గందరగోళములో దూరి, క్రిందపడి చేయి ముఖమునకు రాసి కొన్నాను. ముఖమెఱ్ఱబడి ప్రమాదము తోపజేసి, నలువురకు జాలిపుట్టించినది. ఇంతవరకు మామూలువనే"

"నే నదియు గ్రహించినాను."

"ఊ! హూ! ఇక నేమి! తరువాత వా రందరు నన్ను లోపలకు తీసికొని పోయినారు......"

"మోసికొని పోయినా రనుము. తరువాత"

"ఆమె కది విధి. అంతకన్న నే నేమి చేయకలదు. నన్ను చావడి లోనికి—అ దావిడ గదికి చేరువగనే యున్నది—తీసికొని పోయినారు. నే నంతవర కనుకొనియే యున్నాను. గాలి కొరకు సంజ్ఞచేసినాను. వారు కిటికీ తెరచినారు—తెరచి తీరవలసినదే. అంతకన్న వేరు త్రోవ లేదు. నేను చేయి విసరినాను. నీ కవకాశము దొరకినది."

"దాని వలన నీ కేమి కలసి వచ్చినది?"

"కావలసిన దంతయును. ఇల్లంటుకున్నదని యే యాడు దానికి తెలిసినను తత్క్షణ మామె తన కెక్కువ ప్రియమైన వస్తువు జాగ్రత్త పెట్టుకొనుటకు తొందర పడును. అది స్త్రీ స్వభావము. నే నా యవకాశమునే వినియోగపరచు కున్నాను. పిల్లల తల్లి పిల్లల కొరకును, పిల్లలు లేనిది యాభ రణములు, బట్టల కొరకును, తడుముకొనును. మన యీ కథా నాయికకు మనము ప్రయత్నించు ఫోటోకన్న యితర విలువ గల వస్తు వేదియు లే దాయింటిలో. అందుచే నామె కంగా రుగా నది జాగ్రత్త పెట్టుకొనుటకే పోవును. ఆ గది నిండ చుట్టలు చుట్టలుగా పొగయు, మీ కంగారు కేకలును మెట్టి ధైర్యశాలినైనను గుండె పగుల చేయు లాగున్నవి. మీ అల్లరి కూడ చాల బాగుగా నున్నది. స్వభావసిద్ధముగాను. ఆమె కంగారుగా గదిలోనికి పోయి పెద్ద అద్దము వెనుక గోడలో

రహస్యముగానున్న యొక చిన్న గూడు మీటనొక్కి దానిలో దాచిన ఫొటో వెలుపలకు తీయుచుండగ నేను కొంతవరకు చూచినాను. నే నా యల్లరి మోనమని కేకవేయగనే ఫోటో తిరిగి యథాప్రకార ముంచి, గొట్టము వైపు చూచి తొందరగా గది వెలుపలకు పోయినది। ఆమె తిరిగి నాకు కనుపించ లేదు। నేను వెంటనేలేచి నోటికివచ్చినన్ని క్షమాపణలు చెప్పు కొని యింటి వెలుపల పడినాను. ఫోటో అప్పుడే సంగ్రహించు దమా అని యాలోచించినాను గాని యామె నవుకరు వెంటనే లోపలనుండి వచ్చి నన్ను జాగ్రత్తగా కనిపెట్టి చూచుచుండుట వలన మర్యాదగా నుండదని యాలోచించినాను। ఏ మాత్రము తొందరపడినను వ్యవహారము పాడైపోవును కదా!

"ఆయితే మనమిప్పుడు చేయవలసినదేమి!" అని చక్రపాణి రా వడిగినాడు.

"మనకు కావలసిన సంగతి బోధపడినది కదా! రేపు జమీందారు వచ్చినతరువాత నీవును నేనును కలసి యక్కడకు వెళ్ళుదము. ఆవిడ లేనప్పుడు మన మావిడ కొరకక్కడనే కనిపెట్టుకొని కూర్చుండ వలసివచ్చును. ఆవిడ క్రిందకు వచ్చునప్పటికి మన ముండము. ఫోటో ఉండదు. జమీందా రాఫోటో వాని సొంతచేతులతో తీసికొనుటకు చాల సంతోషపడును."

"మన మక్కడకు వెళ్ళడ మెప్పుడు!"

"ఉదయ మొనిమిది గంటలకు. అవి డప్పటి కింకను లేచి క్రిందకు రాదు. అందుచేత కావలసినంత వీలుగా నుండును. అదియును గాక మనము చాల చురుకుగా నుండవలయును. నేటి యుదయపు యగ్రిమెంటూ, వ్యవహారమును యేస్థితిలోనికి మార్చునో కదా?"

ఈ సంభాషణలో దాదాపుగా యిల్లుచేరు నప్పటికి వారి కొక యువకుడు తెల్లని దుస్తులు, పారశీక వాలకము- సుబ్బరామనున కెదురుపడి "సలామూలేఖుం నాయుడుసాబ్" అని పలుకరించి వెడలిపోయినాడు. తొందరగా పోయినందున నత డెవరో మనవారికి గురుతు దొరకినది కాదు.

"ఆకంఠస్వర మిదివరలో వినినట్లు జ్ఞాపకము కాని యెక్కడనో, అతడెవరో, నాకు స్ఫురించుటలేదు" అని సుబ్బ రామను తటపటా యించినాడు.

## 3

మరునటి యుదయమున వారు పెందలకడ లేచి కాల కృత్యములు తీర్చుకొని, కాఫీపుచ్చుకొనుచుండు నప్పటికి జమీాందారు గారు కూడ వచ్చినారు.

ఆయన పత్తేదారుని రెండు భుజములు పట్టుకొని హెచ్చరికగా "ఆహా! మీా కది నిజముగా లభియించినదా?" అని

ప్రశ్నించి, వాని సమాధానముకొరకాత్రముగా వాని ముఖ
ముపైపు చూడసాగినాడు.

"ఇంకను లేదు"

"కాని నమ్మిక మున్నది!"

"ఆ కావలసినంత"

"అయిన త్వరగా బయలు దేరుదము రండు. నాకు
చాల యాందోళనగా నున్నది."

"సరే. బండి పిలిపించెదను."

"ఆహా! అక్కరలేదు. నా కారు సిద్ధముగానున్నది."

"అయితే మరియు మంచిద" అనుచు లేచి వారు ము
గ్గురు తొందరగా బయలు దేరి నారు.

---

"ఇక ముందు జోరాజాసీ వలన బాధ తమకంతగా నుండదు"

"ఏమి? ఎందువలన?"

"ఆమెకు మరియొకరు లభించినారు."

"అ దెప్పుడు?"

"నిన్నను"

"ఎవరు దేవుడా!"

"నాగపురపు కాపురస్తు డొకడు"

"కాని వాని నామె మనస్ఫూర్తిగా ప్రేమించదు. పేరునకు మాత్రమే కాని......"

"ఆ! లేదు లేదు. ప్రేమించునని నాయాశ. అదిగాక వారొండొరులు పరస్పరప్రేమావిష్టులై కౌగలించు కొనుటను నాకన్నులార కాంచినాను."

"ఏమి? ఆశయేమి?"

"అలాగయిన తమకు బాధయేమియు నుండదు గదా, యని. ఆమె వానిని ప్రేమించిన మీా పై ప్రేమనశించును. ఇరువురను ప్రేమించుట కష్టము కదా! అందువలన మీా వివాహ మనిన యామెకు యీర్ష్యగాని క్రోధముగాని యుండదు. తమరు కావలసినంత స్వేచ్ఛగా వివాహ మాడవచ్చును.

"ఆహా! అవును. యింతవరకు వాస్తవమే. కాని—కాని—ఆమె కూడ నా స్థితిలోనిదైన చాల బాగుండి యుం

డును. ఎట్టి భార్య—ఎట్టిజమీాందారిణీ యై యుండును." అని వెనుకకు జారబడి మూరు మా టాడక పరధ్యాన్నముగా కూర్చున్నాడు. గమ్యస్థానము చేరువరకు మరి మాట లేదు.

మే మక్కడ చేరునప్పటి కొక ముసలిది జోరా యింటి తలుపు తెరచుకొని సిద్ధముగా నిలుచున్నది—మా కొరకే కాబోలును. బండి దిగు మమ్ములను వేళాకోళముగా చూడ సాగినది.

"తమరే సుబ్బరామన్ గా రనుకొనియెదను.

"అవును. నా పే రదియే." అని కంగారుగా తరువాతి మాట కొర కామెవైపు పరిశ్నార్థకముగా చూడసాగినాడు.

"చిత్తము. మా అమ్మగారు చెప్పేరు. తమరు ప్రొద్దు టే తప్పకుండా వస్తారని. ఆమె మరొకరితో కలిసి ప్రొద్దుటే నాలుగు గంటల బండిమీాద నాగపురము వెళ్ళిపోయినది. ఆలా గని చెప్పుమన్నది తమతో" అని చచ్చు కబురొకటి చాల వెటకారముగా చెప్పినది.

సుబ్బరామన్ చాల కంగారును, యాశ్చర్యమును వెలి బుచ్చి "ఏమి? ఆమె యీా పాంతములు విడిచి వెళ్ళిపోయిన దనియెదవా?" అని యడిగినాడు.

"ఆ! కచ్చితముగా."

"తిరిగి రాదా?"

"ఎప్పటికీ!"

"ఆహా! కాగితములు. కొంప మునిగినదే" అని జమీందారు కంగారు పడసాగెను.

"అయినా చూతాము" అని సుబ్బరామ నా గుమ్మమున కడ్డుగా నున్న ముసలిదానిని ప్రక్కకు గెంటి తొందరగా లోపలకు పోయెను. మిగత యిద్దరు వాని వెంట బడిరి. ఇల్లంతయు కంగారు గానున్నది. పెట్టెలు, బీరువా సొరుగులు తెరచియే యున్నవి. ఆమె చాల తొందరగా ప్రయాణమైనటుల కనపించినది. సుబ్బరామన్ తొందరగా అద్దము వెనుక నున్న చిన్న యలమారు తెరచి అందులో నుండి ఒక 'కేబినెట్' ఫోటోయును, ఒక ఉత్తరమును వెలుపలకు తీసినాడు. ఆ ఫోటోలో వారు భ్రమపడినటుల యిరువురును గాక యామె యొక్కతియె యున్నది. ఉత్తరము పైవిలాసము "సుబ్బరామన్ గార్కి. వారు వచ్చు వరకిక్కడనే యుండవలయును." అని యున్నది దానిమీద. అతడు తొందరగా నా యుత్తరము చింపి లోపలి కాగితము తీసెను. అర్ధరాత్రిమున వ్రాయబడినటు లున్నది. అందీ విధముగా నున్నది.

"సుప్రసిద్ధ పరిశోధకులు సుబ్బరామన్ గార్కి. అయ్యా! తమరీవ్యాపారము చాల నేర్పుగా సాగించినారు. అగ్ని భయము మోసమని తెలియువరకును యిందలి మోసము నా కెంతమాత్రమును స్ఫురించినది కాదు. నే నటులగా నా రహస్యమును వెళ్ళడిబరచిన తరువాత చాల యాలోచించి నాను. పశ్చాత్తాప పడినాను. మీ విషయమై చాల జాగ్ర

త్తగా నుండవలసినదని నా కిదివరకు కొన్ని నెలల క్రిందటనే తెలిసినది. జమీందారు గారు నాపై దండయాత్రకు యెవరి నైనా తయారుచేసిన వారు తప్పక మీరేనని నే వినియున్నాను. ఇంత జరిగినప్పటికిని మీకు కావలసిన ఫోటో దాచిన రహస్యస్థలము నా చేతులతో నేను వెళ్ళడి పరచునటుల చేసినారు. మీసంగతి నే ననుమానించి నప్పటికిని యంతటి సాత్త్విక వేషమున నున్న వాని హృదయ మింత కుటిలత్వమునకు సిద్ధపడునని నాకు నమ్మకము కలిగినది కాదు. అయినను నాటక రంగస్థలముల కలవాటు పడిన దానను గనుక, పురుష వేషము నాకంత కష్టతర మయినది కాదని మీ రెరుగుదురు. నాకిది మొదటిసారి గాదు. అందుచేత నా నవుకరును మీపైకి కాపలాకు పంపి, తొందరగా లోపలకు పోయి, కావలసిన దుస్తులు వేసికొని, మీరు నా యింటినుండి పోవునప్పటికి నేనును సిద్ధపడి వచ్చినాను.

"మిమ్ము వెంబడి వచ్చి, నా సందేహమునివృత్తి చేసికొని, యింత ప్రఖ్యాతిగల పరిశోధకునకు గూడ పనిగలిగించ

గలిగితిని గదా యని నాలో నేను గర్వపడుచు, యాఖరు సారిగా మీకు కృతజ్ఞత తెలుపు నభిలాషతో మీకెదురుపడి సలాము చేసితిని. నా పెంకితనమునకును, బాల్యచాపల్యము నకును మన్నింపుడు నన్ను.

"నేను యింటికి పోయి, నా ప్రియునితో నాలోచించి, యింతటి ప్రతికక్షితో ప్రతిఘటించి పనిచేయుటకు నాకు సరదాగను,ఆసక్తిగను ఉన్నను, మావారి కెంతమాత్ర మిష్టము లేనందున తత్క్షణను బయలుదేరి దూరముగ పోవుచున్నాను. మీరు శ్రమపడి, ఉదయము దయచేయు నప్పటికి పిట్ట కనుపించదు. గూడు ఖాళీగా నుండును.

తరువాత ఫోటో గ్రాపు విషయమై మీ క్లయింటు గారు—ఆయన నేమి చేసినానో—కావలసినంత బెదురు తీరి యుండవచ్చును. నే నంతకన్న సత్పురుషుని మరియొకనిని వలచి, వలవబడితిని. వా రంత దుర్మార్గముగా నిరసించిన యబల వలన వారి కెంతమాత్రమును బాధయుండదని చెప్పి మీరు వారి బెదురు తీర్చ ప్రార్థించుచున్నాను. ఆయన ముందు నా కెన్నడైన ద్రోహము తలపెట్టిన కాపుదలగా నుండుటకు నే నా ఫోటో జాగ్రత్తపరచితిని. అంతియే. ఆయన జాగ్రత్త పరచుకొన నభిలాష పడును గనుక మరియొకటి యుందు విడచితిని. ఇక నాకు సెలవు దయచేయుడు."

ఇట్లు,
జో రా.

ఉత్తరము శాంతముగా విని "ఆహా! ఎంతటియాడుది. ఎంతటి చమత్కారి. నేను తొలుతనే చెప్పియుంటినిగదా! ఆమెధైర్యము! ఆమె నిశ్చలత! ఆమెవంటి యాడుది యొక రాజ్యము పరిపాలించగలదు. నా సమానస్థితిలోనిది కాకపోయి యుండుట నా దురదృష్టము"! అని చాల వితర్కించ సాగినాడు జమీందారు.

సుబ్బరామశ చాల వ్యంగ్యముగా "అయ్యా! నేను చూచినంతవర కామె మీకు సమమైన రకము లోనిదికాదు. చివరకు తమకు వాగ్దానము చేసిన ప్రకారము ఫొటో సంపాదించలేకపోయితి నని నాకు చాలాకష్టముగా నున్నది" అన్నాడు.

"ఆహా! అంతవర కవసరములేదు. ఆ విషయమై తమరు నొచ్చుకొనక్కరలేదు. ఇంతకన్న సంతృప్తి కరముగా మరొక టేదియు జరుగదు. ఆమె చాల కచ్చితమైనది. మాట నిలకడకలది. ఫొటోగ్రాఫ్ వలన మన కిక భయ మెంతమాత్రము నుండదు. అది యగ్నిగుండమున పారవేసినటుల మనము సంతుష్టి పడవచ్చును" అని జమీందారు సంతృప్తికరముగా మాటలాడినాడు.

"తమ రీలాగున వచించుట నాకుచాల సంతోషముగా నున్నది."

"నేను మీకు చాల ఋణపడ్డాను. నేను మి మ్మే విధముగా సత్కరించగలనో. ఈ వజ్రపుటుంగరము........" అనుచు నాయన వాని వ్రేలినున్న యమూల్యమైన యుంగరము తీయబోవు చుండెను.

"ఇంత కన్న విలువగలది మరియొకటి మీ స్వాధీనములో నున్నది" అన్నాడు.

"ఆహా! అంతకన్ననా? మీరు చెప్పిన చాలును. ఇచ్చుట కభ్యంతర ముండదు"

"ఈ ఫోటో గ్రాఫ్"

జమీందారు పాశ్చర్యముగా గుడ్లు తెరచుకొని వాని వైపు చూచి "ఈ—ఫోటోగ్రాఫా? జోనాదా? ఆ- ఆ-—సరే -మీకు కావలసిన తప్పక తీసికొనుడు,, అన్నాడు.

"చిత్తము. ప్రభువులకు వందనములు. ఈ విషయములో నింత కన్న వేరేదియు చేయ నవసరము లేదు" అని నమస్కారము చేసి, జమీందారు వెడలి పోయిన తరువాత చక్రపాణి రావుతో "అట్లుచూచెదవేమి? ఈ ఫోటో నా యెదుట సర్వకాల సర్వావస్థలయందు నుండవలసినదే. మనల నింత వరకు బోల్తా కొట్టించినదీమె యొక్క తెలివే మన పేరు విని బెదరినది గాని యామె పేరు విని నేనుచేతులు జోడించ వలయునని గర్వము వీడి యొప్పుకొనుచున్నాను.'' అన్నాడు పరిశోధకుడు.

సమాప్తము.



రాజన్ ప్రెస్, రాజమండ్రి.



# ఉచితము!
# క్లీనింగ్!
# ఆయిలింగ్!
# ఉచితము!



మాదగ్గర అన్నిరకముల వాచీలు గడియారములు వగయిరా దొరకును. మాపూచీ (వ్రాతమూలమయిన గ్యారంటీ) మీద యీయబడును.

వాచీలు, గడియారములు, గ్రామాఫోన్లు వగయిరా అన్ని బాపతులు మంచి పనిముట్లతో, నమ్మకముగా మరమ్మతు చేయబడును.

ఫోటోగ్రాపులు అన్ని సైజులలోను సరసమైన తగ్గింపు ధరలకు తీసి యీయగలము. బ్రోమైడు ఎన్లార్జిమెంట్లు ఎంత ప్రాతఫోటోనుంచి అయినను సరే, కావలసినంత పెద్దసైజులోనికి, తయారుచేసి యీయబడును. రేట్లు చవుక. ఒకసారి చూచిన తెలియగలదు.

నారాయణరావు బ్రదర్స్
ఫోటోగ్రాఫర్స్,
శ్రీకృష్ణావాచ్ కంపెనీ
రాజమండ్రి.

# రామామృతము.

తు 20 లేక అరపౌను — రు 6—0—0.

తు 40 లేక పౌను — రు 10—0—0.

ఇది లోహము, అభ్రకము, మోమియా మొదలగు విలువమైన భస్మములతోను, తదితర వనమూలికలతోను తయారు చేయబడిన లేహ్యము. అనుపానములమార్పులలో దిగువవ్యాధుల కమోఘముగా పనిచేయును.

అజీర్ణములకు, కోరింతదగ్గులకు, కామిర్లకును పెట్టినది పేరు. శుక్లనష్టములకు, ఆర్తనక్షీణములకు, గర్భాశయము లందలి అన్ని బాపతుల జబ్బులకు, ఋతుశూలలకు, కుసుమ రోగములకు దివ్యౌషధము.

బయిష్ట సంబంధమయిన అన్ని జబ్బులకును పనిచేయును. గర్భాశయములందలి బాధలు నరిచేసి, సంతానమునకు సావకాశ మొసంగును. ప్రసవించిన స్త్రీలకు శరీరములో రక్తమువృద్ధిచేసి, పిల్లలకు పాలను కలుగచేయును. చిన్నపిల్లలకు వచ్చు ప్రతిరోగము నివారణ చేయును. పని చేయలేదని ఋజువు చేయువారికి డబ్బు తిరిగి యిచ్చివేయబడును. ఒకసారి వాడిచూచిన తెలియగలదు. సలహా ఉచితము.

మరా;—మాదగ్గర, అన్ని ఆయుర్వేద ఔషధములును శాస్త్రప్రకారము తయారయి సిద్ధముగానున్నవి.

జి. వి. రమణారావు,

మెరకవీధి, రాజమండ్రి.

# మా ప్రచురణములు—క్రొత్తవి

| | | |
|---|---|---|
| పడకటింటి రహస్యాలు. ముద్దులొలుకు బొమ్మతో | | 0—12—0 |
| భట్టీ విక్రమార్కుల కథలు | | 0— 8—0 |
| అరేబియన్ నైట్స్ కథలు | ఒకటవభా॥ | 0— 8—0 |
| డిటో | రెండవ భాగము | 0— 8—0 |
| ఏకాక్షి (పరిశోధక నవల) | ఒకటవభాగము | 0— 8—0 |
| ,, | రెండవభాగము | 0— 8—0 |
| జోరాజానీ (పరిశోధక నవల) | | 0— 4—0 |
| పశ్చాత్తాపము (తమాషాలు) | | 0— 4—0 |
| బంగారుయోగము | | 0— 4—0 |
| చమత్కారము (సానిపిల్ల) | | 0— 4—0 |

అచ్చులో నున్నవి.

| | | |
|---|---|---|
| తంత్రశాస్త్రము (వశీకరణ తంత్రము) | | 0— 8—0 |
| మతిమాలిన మరణశాసనము | ఒకటవ భాగము | 0— 8—0 |
| ,, | రెండవ భాగము | 0— 8—0 |
| ,, | మూడవభాగము | 0— 8—0 |
| పేమజాబులు (పద్య సమ్మిళితము) | | 0— 8—0 |

నారాయణరావు బ్రదర్స్.

